# వెంకి పాటలు



గ్రంథకర్త :

నండూరి వెంకట సుబ్బారావు బి. ఏ., బి. యల్.



ఉదయభాస్కర్ పబ్లిషర్సు

విజయవాడ - 1

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి]

[వెల రు. 4-00

నా

పెత్తల్లి కుమారుడు

శ్రీ బాపరాజు

వెంకట సుబ్బారావు గారికి

"రాష్ట్రములఁ బాలనమొనర్చు రాజులందు

రాజై ప్రాకటుఁడు సింహమనో రాఘవునకు

# ఒకటి రెండు మాటలు

శ్లో॥ యదిసంతి గుణాః శ్లాఘ్యాః వికసంత్యేవతే స్వయమ్
నహి కస్తూరికామోదః శపథేన నివార్యతే.—

అని యొకానొక మహాకవి చెప్పినట్టులు, మృదుమధుర రసార్ద్రన ములయి, సహజకోమలములును భావనామాత్ర సంవేద్యములును నైన్రి కవి కుమారుల కవితా కల్ప ప్రసూనములందలి పరిమళలహరులు స్వయముగ దమంత తామే సమస్త దిగంతములను సయితము వ్యాపించి, విశ్వవ్యాప్తములును విబుధజన శ్లాఘ్యములును నై విలసిల్లుచుండగా, నందలి గుణవిశేషములను సహృదయుల సన్నిధి నెఱుకపఱచుటకై నావంటి పరిమిత ప్రజ్ఞుని పరిచయవాక్యము లంతగా నవసరములు కావని తలంచుచున్నాను. ఏలయందురా? మందార ప్రసూనములలోని మకరంద మాధుర్యమును గ్రోలి సొక్కుటకు మిళిందకుమారునికి ఎవ్వరు పరిచయమునుగలిగించిరి? మలయచందన మందలి శైత్య సౌరభ్యముల కుబ్బి తబ్బిబ్బై వానిని లోకమునందెల్ల యెడల నింపదివిరిన దక్షిణానిలాంకురమున కే సుధీవరుని పరిచయ వాక్యములు ఉద్దీపనమును గలిగించినవి? అట్లే ప్రస్తుతము ప్రకటితములై భావుకలోకము సన్నిధిని అర్పింపబోవుచున్న యీ వెంకిపాట లనెడి ప్రేమపూరితములగు కవితా కల్ప ప్రసూనముల విషయమునందుగూడ నని మనవి. అయినను ప్రస్తుత మాంధ్ర లోకమునందు తక్కిన యన్ని యలవాటులతోఁ బాటు ఎంతటి తేనెవాకల నూరించు సరస కావ్యమునకైనను ఏవో ఒకటి రెండు మాటలు పీఠికాకృతిని గ్రుచ్చవలసియుండుట యాచారమైపోవుటచేత, నందులకు విధేయులమై ఒకటి రెండు మాటలను యిచ్చుట మనవిచేయ సాహసించితిమేగాని ప్రజ్ఞాపారమ్యమునుబట్టి మాత్రము కాదు.

వెంకిపాటలు ఈ ఇరువదివ శతాబ్దిని మన యీ ఆంధ్రవాఙ్మయ కల్ప శాఖిక ప్రసవించిన సర్వాంగ పరిపూర్ణ పరిణతీ విలసితంబులగు దివ్య ప్రసూనరాజములుగాని, పూపబెడంగులు పచరించు పసరు

మొగ్గలుకావు. బ్రహ్మానంద సహోదర మనియు, నవాఙ్మానసగోచరమని యును, నిర్వచించు రసస్వరూపమును- పండితులకు సైతము రూపింప శక్యముగాని రసస్వరూపమును, భావనాశక్తిగల ప్రతి వారికిని గోచర మగునట్లు మూర్తీభవింపజేసిన అమృత గుటికలుగాని అన్యములుకావు. దివ్యతాపూర్ణములగు భావనాసీమలందు ప్రయత్న విశేషమున ప్రోది సేయఁ బడిన ప్రాభవసంపదల చెన్నలరారు పుష్పరాజములు కాని. అంతంతమాత్రపు అరవిరు లెన్నటికినిఁగావు. ఆంధ్ర సరస్వతీ పాదపీఠిక యందు—భక్తివారితమగు నభినివేశముతో - ప్రేమపూరితములగు భావనలతో — సహజము లగు అందములు చందములు — ముద్దు ముచ్చటలతోఁ గూర్చి కూర్చి సమర్పించిన దివ్య మహిమా సమన్వితము లగు కంఠహారముల కూర్పులుగాని, ఏదో పదాడంబరములతో అందతుకు లతో నేర్పరుపబబడినవి మాత్రము కావు. ఇంతయేల ప్రియపాఠకులు ఈ పూజా కుసుమములలో నే యొకదానిని జిత్తగింపినను ఈ నా మాటలు అతిశయోక్తులు ఎంతమాత్రమును కావని యెరుంగగల్గుటయే గాక అనంతములు ననుభవైక వేద్యములు నగు రసరామణీయకతలను, ఆమంద మకరంద లలితములై దివ్యసౌరభ సురభిళములై చిత్ర విచిత్ర వృత్త విలాస భాసురములై యొప్పు కవితా విలాసములను చిత్తగించి ఆనందింపగలుగుదు రనుట నిక్కము

మన ఆంధ్ర సారస్వతోద్యానవాటికలయం దింతవఱకు చాలవఱ కును ప్రౌఢ ప్రబంధ రీతులతోను జటిల పదబంధములతోను ఘనము లగు వృత్తబంధురతలతో విలసిల్లి రసమహితములై యొప్పు ఉన్నత వృక్షరాజము లెన్నెన్నియో వివిధ రూపములతోఁ బ్రోది సేయబడిన వను టయు, అయ్యవి యన్నియును యథాశక్తి సౌరభపూర్ణములగు కుసుమ ఫలాదికమును బ్రసవించుచునే యున్న వనుటయునుకూడా సత్యేతరము కాదు. కాని పండిత పామర సాధారణముగా జనసామాన్యము ఆస్వా దించి తనిసి తమంత తాము గానముచేసి ధన్యతంగాంచుట కనువగు రీతిని—లాలిత్య సౌకుమార్య స్వచ్ఛ సౌరభములను వెదజల్లు మంజ రులుగల పూవుఁ బొద లంతగా బ్రోది సేయబడి యుండలేదు. అట్టి

లోపమును తీర్చుటకై ఆధునిక యుగము నందలి కవితోద్యాన పాలకులగు కవి కుమారులు పెక్కురు నడుములు గట్టి రాత్రిందివములు పరిశ్రమ చేసి ఆ ప్రాఁతోవలను దిద్ది తీర్చి-అపూర్వములగు సంపదములతో నలంకరించి - ఏ మాత్రముకూడా విన్నాణము వాసియును కొఱవడనీయకుండ విలసిల్లజేసి సార్వజనీనత నొనగూర్చు చున్నారు. వీరి యీ యుద్యమము శుద్ధమును సమృద్ధమునై యలరారఁగల సూచనలు గన్పించుట మిగుల ప్రశంస్యము.

ఈ విధముగాఁ బ్రస్తుత కాలమున మన యాంధ్ర సారస్వతోద్యానపు సార్వజనీన శాఖాభివృద్ధికై పాటుపడుచున్న తరుణ కవికుమారులలో శ్రీ యుతులు సండూరి వేంకట సుబ్బారావు పంతులు (బి. ఏ.) గారును నొకరు. వీరు చక్కని కవి ప్రపంచమునకు వెలిగా తమ శుశ్రూషాంజలులను భిన్నమార్గమున నాంధ్రవాగ్దేవి సన్నిధి నలంకరించు చున్నారు. సుబ్బారావుగారు ఆంధ్రజాతికి సహజములై శాశ్వతములై - సొంపునింపగల మృదుమధుర గేయములలో అందునునేడు - వాడుకలో - వ్యవహారములో నున్న మృదుభాషలో వెంకి నాయుడు బావల దాంపత్య ప్రీతిమయతను భావోన్నతిమయతను మిగుల గొప్పగను తగిన ప్రణయ గాథలను గానము సేయుచున్నారు. నిజముగా వెంకి నాయుడు బావ లనే నాయకులున్నారో, లేక వారు కవి కల్పనా సృష్టిలో చెప్పజాలనన్నను - వెంకి పాటలను వినునప్పుడు మాత్రము, శ్రోతలు తన్మయతను జెంది తమ తమ భావనావీధులలో నసమయమూర్తులగు వెంకి నాయుడు బావలను తప్పక గాంచగల్గుదురు ఒక్క గాంచుట మాత్రమేనా — గాంచి — తా మనుభవించిన ఆ యానందమును — మిగుల నా గీతముల తోనే అనువాదరూపమున వెల్లడింపని సహృదయ శిరోమణి యుండుటయుగూడ గానము. వెంకి పాటలయం దింతటి మహత్త్వము గలుగుటకు తజ్జనకులగు వెంకటసుబ్బారావు పంతులుగారి రసానుభవ వ్యగ్రమగు హృదయ పరిపాక పేశలతయును, లోకజ్ఞతయును ముఖ్యములగు కారణములని నాకుగల నమ్మకము.

తత్త్వాన్వేషణముఁ జేసినచో మన వాఙ్మయమునందలి గేయవిభాగము కూడ నిదివఱకే చక్కఁగా దిద్దితీర్చబడినది. మహాకవి శిరోమణులనందగిన క్షేత్రయ్యకవి, రామదాసు, వరదరాజు, తాడంకివారు, ఏగంటివారు మున్నగు గేయకవులు - తమ తమ గంగా సదృగ్ధారలుగల వాగ్ధారాలతో ప్రేమ - భక్తి - తత్త్వములుగల నమృతంపువాహినుల బ్రవహింపగఁజేసి ధన్యతం గాంచియే యున్నారు. అమృతంపు రసవాహినులఁబారించి వారు ప్రోదిచేసిన ప్రణయ వల్లికలు నాంధ్ర హృదయసీమల నల్లిబిల్లిగ నల్లుకొని పూచి ఫలించి తత్సౌరభములచే నిప్పటికిని మన కుల్లాసము గల్పించి శాశ్వతత్వము నందించుచునేయున్నవి. కాని వారు ప్రోదిచేసిన ప్రణయవల్లికా ప్రసూనములు మన వెంకి నాయుడు బావల ప్రణయవల్లికలవలె విశుద్ధ ప్రేమభరితములై నట్టివిగాక భక్తితత్త్వాద్యన్యతరదజాతులతో సమ్మిశ్రితములు గాంచినట్టివి. మరియు వారు సేకరించిన ప్రసూనరాజముల సౌరభములు అద్వితీయమగు దార్శనిక విభవముగల యే కొలదిమంది ప్రజ్ఞానిధులకోగాని తక్కిన సాధారణ జనమునకు పూర్ణముగా నాస్వాదింప వీలుపడనట్టివి. ప్రస్తుతము మన వేంకట సుబ్బారావుగారు సేకరించిన వెంకి నాయుడు బావల ప్రణయపూతములగు నీ పాటలన్నియో పండిత పామర సాధారణముగా .- నెల్లవారికిని యే మాత్రపు భావనాశక్తియున్నను, అందుకొనుటకు ఆనందించి తనిసి తనియింపజేయుటకును వీలైనట్టివి. నిక్కమగు ప్రేమయును, దాంపత్య భావమును ధర్మపరతయును యెట్టి యాదర్శములను గలిగి యుండునో యను విషయమును, ఈ పాటలంత తేటతెల్లముగా -సాధారణ జనమున కంతటికిని తెల్పగల గేయము లిక తప్ప మనలో నితరములు లేవనుట సత్యదూరముకాదు.

సుబ్బారావు పంతులుగారు గానముచేసిన పాటలలో భావముకంటెను ముందుగ భాషయును, భాషకంటెను మున్ముందుగ భావమును, సహామహమికతో ఒద్వావెత్తు చుండెను. ఏ యొక్క స్థలముననైనను వీనిగమనమునందు యేమాత్రమైనను వంటుపడినదేమో యని యెంతగ వెదకినను మచ్చుకైనను నాకు అట్టిది యిందు కానవ

చ్చుటలేదు. వీరు యీ గేయములందు కూర్చిన పదములుగాని, పదార్థములుగాని కొంచెము కొంచెము కవితలలోవలె ప్రయత్న విశేషమున నేర్చితెచ్చి కూర్చిన వెంతమాత్రమును కాక ప్రతినిత్యమును మన కన్నుల యెదుట-క్షణక్షణమును గోచరించుచున్న వేయగుట యెన్నదగ్గ ప్రధానమగు విశేషము. వాని నీ కవి కుమారుడు గేయరూపమునగూర్చి సహృదయలోకం సన్నిధిని ప్రదర్శించినప్పుడు పాత్రము లెట్టివైనను "ఔరౌరా"—యని యనిపించునంతటి మహోజ్జ్వలత వీనియందు విలసిల్లి - తత్ప్రభావమున శ్రోతల హృదయసీమలు ఒక్కమాటుగా మిరుమిట్లుగొనుటయును కలుగుచున్నది. భావనాధనులగు మనుం కవిలోకమునం దింతటి శక్తిసామర్థ్యము లున్నవిగనుకనే మన పూర్వీకులు,

శ్లో. తఏవ పదవిన్యాసాః తా ఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్ -

అని కవిసృష్టిని ఆనంద సంసూచకములగు శిరఃకంపనములతో గారవించియున్నారు. ఇట్టి ప్రశంసార్హములగు శక్తిసామర్థ్యములు గలవ రచుకొనిన కవికుమారుడు-మన యాంధ్ర వాఙ్మయమునకు వోదగూర్పు యును - నందున మనమున్న నీ యుద్వేగపు ...... మన ...... దుట-మన కవిరాజులల్లిన యీ విషయముల దివ్యగానముల నిచ్చి మనల నానందసాగరమున నోలలాడించుచుండుటయు చూడగలిగిన నాబోంట్ల జీవితములు ధన్యములు ధన్యములైనవనుటలో నావంత యును సందియము లేదు.

మొత్తముమీద నింతవరకు నీకవి గానముచేసిన యీ ప్రణయ రూపములగు గేయములు ముప్పదియైదు మాత్రముగలవు. క్రమముగాను మును భావ పరిణతియనుగలుగు పవిత్రంబగు గుచ్ఛములో*8 26–34 సంఖ్యగల పాటలు-(అనగా మాయదారి ...మ్మడు, సాటేలా, పడవ- అను శీర్షికలుగల పాటలు) వేసవిలమును వెంటనే ...... ప్రణయగాథలకు మాత్రమే సంబంధించినవి కావు కాని అంతయో యింతయో ప్రణయమును

---

* ఆర్యసంప్రదాయము చెప్పిన 32 మణుగుల ...... గుత్తం

మన బడును. గుత్సమనుమాటయే గుచ్ఛమన్న పేరుతో వ్యవహారమున నున్నదని నా తలంపు. కావుననే నేను నిచ్చట హారభేదమును తెలుపుసందర్భమున గుత్సశబ్దమునకు పర్యాయముగా గుచ్ఛమను పదమును వాడితిని. (పం. ఆ. శా ) యెంతయో వెంకి ప్రస్తావనకు అందును చోటు లేక పోలేదు. కనుకనే కాదోలు కవిగారు వానినికూడా నిందు పొందుపరచియుందురు. కాని మన మా మూఁడు పాటలను పరిగణనమునం దుపేక్షించితిమేని (ఉపేక్షించుటకు మఱొక బలవత్తరమైన కారణముకూడ కలదు. దానిని ముందు నిరూపింతును.) ఈ పాటలకు మనము గుచ్ఛమన్న పేరును వాడుట కెట్టి యభ్యంతరమును లేదు శ్రీ సుబ్బారావు పంతులుగారి రచనలగు నీ గేయములలో నేదొకదానిని పరీక్షించినను మూఁడు నాలుగు చరణములకన్న నాకృతియందు గ్రంథబాహుళ్యము ఎక్కువగా గోచరింపదు. కాని వానియందే దాగియందలి భావసంపదను వివరించవలసి వచ్చినను సంపూర్తిగా వివరించుటకు నలువది పేజీలకుఁ దక్కువగ పట్టనే పట్టలేదు ఇది భావుకు లెరిగిన యంశమేగదా!

సాధారణముగ నుపోద్ఘాత రచయితలగువారికి - ప్రస్తుత మగుచున్న యంశమును సాకల్యముగ వర్ణించి గుణదోషవిచారణ సేవచేయవలసియుండుట యొగుల ముఖ్యమని నే నెఱుంగకపోలేదు కాని అల్పావకాశముగల ఈ ప్రవేశమున నద్దానిని నిర్వహించుట దుశ్శక్యము, కావున మఱొకమాఱు దీర్ఘముగా విమర్శింపఁ దలంపుగల నేనీ విషయము నింతతో ముగించుచు భావనాధనుడగు నీ కవికుమారుని ప్రయత్నములు సఫలము లగునట్లును ఇట్టి వీరికి ఆయురారోగ్యైశ్వర్యాది విభవముల నొసంగి, ఇతోధికముగ నాంధ్రవాగ్దేవికి సేవాంజలుల నర్పింపజేయునట్లును అనుగ్రహించుటకై ఆ పరాత్పరుని వేలకొలది ప్రణామముల చేత నిరంతరము నర్థించుచున్నాను.

చెన్నపురి
క్రోధన భాద్రపద శుద్ధ
సప్తమి, బుధవారం

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

# పీఠిక

ఈ పాటలు నేను మద్రాసులో క్రైస్తవ కళాశాలలో పట్టపరీక్షకు చదువుకొనే దినాలలో (1917-1918) వ్రాయ మొదలెట్టినాను. అప్పుడు నా అదృష్టంవల్ల-మ. రా శ్రీ అధికార్లసూర్యనారాయణరావుగారి స్నేహభాగ్యం లభించటం, ఆయనతో కలిసి వాసం చేయటం కలిగింది. నన్నంతకుమునుపే సారస్వత విషయాల్లో అంతో యింతో తరిఫీదు చేయుచున్న మా బసవరాజు అప్పారావుకూడా అక్కడే వుండేవాడు. వారితో ముచ్చట్లకు మ రా శ్రీ పాటిబండ్ల అప్పారావుగారు వచ్చుట మామూలు.

వారందరు యెవరి రచనల గురించి వారు సొంపుగా మాట్లాడుకొంటుంటే నేనొకప్రక్క గూర్చుని విస్తుపోయి వినటం రివాజు.

ఒకనాడు కాలేజీనుండి ట్రాంబండిలో వస్తుండగా, గొంతులో ఒన్ననిరాగం బయలుదేరింది దానిని నాలో నేను పాడుకోవాలని సాహిత్యం జ్ఞాపకంచేసుకోబోయాను. ఎప్పుడో విన్న పదంలాగున "గుండె గొంతుకలోన కొట్లాడుతాది" అన్న పల్లవి వచ్చింది. అదే మననంచేసుకోగా చేసుకోగా యిల్లు చేరేసరికి నేను వ్రాసిన మొదటిపాట తేలింది.

మా "జానకీ పతి"కిన్నీ, అప్పారావుకున్నూ ఆ పాట గద్గదికతో వినిపించాను. "సెబాస వ్రాయ"మన్నాడు జానకీపతి. "నీవు నిత్యం వాడే భాష కాదిది యీ భాషసాయమున సత్యాన్వేషణ చేయరే" వన్నాడు మా బసవరాజు అప్పారావు.

ఏ సమయమున వెన్ను చరిచాడో, సూర్యనారాయణ; అప్పటి నుండియు 'యెంకిని కవితారీతిని స్మరించుట' నిముసమైన మానలేదు. అతడును అంతకంతకు తన అభిప్రాయమును బలపరచుకొన్నాడు. మా అప్పారావు రాను రాను తన అభిప్రాయం మార్చుకొని ఇటీవల అతడును వల్లె అనుచున్నాడు

పాటలు అప్రయత్నంగా వచ్చేటట్లు ప్రసాదించిన యెంకికి కృతజ్ఞుడనా! ప్రోత్సాహము చేసి వీపుదట్టిన అధికార్లవారికా! కవిత్వ కళా

రహస్యాలు తెలియజెప్పిన మా బసవరాజు అప్పారాయనికా। ముప్పర కును.

ఇంకను సహృదయులెందరో చాలకాలం నుంచీ నన్ను హెచ్చరిస్తున్నారు. అందులో "యెంకి" పాటలు పదిమందికి వినిపించిన వారు దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర పత్రికలోనేమి, భారతిలోనేమి ఆ పాటలకు తగిన తావొసంగి యీ పుస్తకం తమ అచ్చులో యెంతో అభిమానం చూపి, రెండు మాసములు యీ పుస్తకమును తమ మూడు పత్రికలోనూ ఉచితముగా అడ్వర్ టైజ్ చేయునట్లు ఆర్డరు దయచేసినారు. వారి కెంతో కృతజ్ఞుడను.

'సాహితి' మా పత్రికే. అనసూయ, జనరంజిని, జ్యోతి, సుజన రంజనీ ప్రతికాధిపతులును నాకెంతో గౌరవమొసంగినారు. శారదయు అట్లే. వారూ తెలుగుతల్లియొక్క నిజస్వరూపం చూడవలెనని, ఉవ్విళ్లూరు చున్నవారే; తెలుగు పస, తెలుగునుడి, తెలుగునాదం, తెలుగురుచీ తెలిసి కొని మన జాతి సాంప్రదాయాలలోగల సొగసు, జీవనమూ, పదిమంది కిన్నీ మనసు కెక్కించాలని కంకణము కట్టుకుని కృషి చేస్తున్న వారే. వారందరికి నా నమస్కృతులు.

ప్రభువులలో మా ప్రభువులను, కవులూ రసికులూ, అయిన శ్రీశ్రీశ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దురుగారు యీ పాటలు విని ఆనందించేవారు ఆ మహారాజు నాకెన్నో విధాల మేలుచేసేవారు. వారి వంశ మాచంద్రార్కమూ నిలుచుగాతయని పరమేశ్వరుని ప్రార్థిస్తు న్నాను పాటలలో సగంపైగా నూజివీటిలో శ్రీవారి సన్నిధినే వ్రాశాను.

మా అభినవాంధ్రకవి మిత్రమండలి వారందరు నా ప్రాణ మిత్రులు. మా ప్రెసిడెంటుగారగు శ్రీయుత కోలవెన్ను రామకోటేశ్వర రావుగారి ద్వారా వారిదయకు బదులు నా వందనము లర్పిస్తున్నాను.

ఇందులో చిత్రపటములు మా అడవి బాపిరాజుగారు వ్రాసినవి. ఆయన చిత్రములలోని మహోన్నత భావాలకు నా యెంకి పాటలే కారణ మైతే ధన్యుడను.

మద్రాసు ఆంధ్ర పండిత మండలి వారు నన్ను ప్రత్యేకం ఆహ్వానించి గౌరవించారు. అప్పటినుంచీ పండితులంటే భయంపోయి భక్తిమిగిలింది. వారికి నా నమస్సులు

కావ్య వ్యాకరణతీర్థులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిల వారికి మా యెంకి పేరుచెబితేనే యెంతో ఆపేక్ష; పాటలంటే ప్రాణమే! పండితులయిన్నీ "యేమో, చదువురానివారి పాట" లని తోసెయ్యరు. యెంకిపై పదిమంది హృదయాల్లో భక్తికలిగించింది. వారున్నూ బ్రహ్మశ్రీ పొక్కులూరి లక్ష్మీనారాయణగారున్నూ, వా రిరువురికి నా నమస్కారాలు

తెలుగు దేశంలో పేరొందిన మేటిగాయకులు మ రా. శ్రీ విద్వాన్ పారుపల్లి రామకృష్ణయ్యగారు యెంతో శ్రమపడి శ్రద్ధతో యీ పాటలకు స్వరం వేశారు. వారికి నా నమస్కారాలు, అదే నేను పాడేవిధము.

తర్క-వ్యాకరణ శాస్త్రివేత్తలగు బ్రహ్మశ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిలుగారు తమకుతామై కోరి, యీ పాటలు చక్కగా అచ్చువేయించినందుకు వారికి చదువరులతోబాటు నేను కృతజ్ఞుడను

ఈ కృతి నర్పించినది నా పెత్తల్లి కుమారునకు. నా తండ్రి నాకు నాలుగైదుదేండ్లున్నప్పుడు కాలంచేస్తే. అప్పటి నుండి యిప్పటివరకు మా కందరకు అతడే పట్టుకొమ్మ, "చంద్రునకొక్క నూలిపోగ" న్నట్లు అతనికీ కృతి సమర్పిస్తున్నాను

మద్రాసు
29-8-25

నండూరి వెంకట సుబ్బారావు.

## కొత్తపాటలకు పీఠిక

ఎంకి పాటల ప్రథమ ముద్రణమయిన్నీ ఆ ప్రతులు నిండుకొనిన్నీ కూడా చాలాకాలం గడిచింది. ఈ క్రొత్త పాటలతోపాటు ఎంకిపాటల పునర్ముద్రణమున్నూ చేయదలచి యెప్పటికప్పు డేవో ఆటంకముల మూలాన ఆలస్యం జరిగింది.

నేను 1926లో న్యాయవాదివృత్తిలో చేరేటప్పుడే మిత్రులు Law

కున్నా కవిత్వానికిన్నీ సగమెరుకసుమీ అన్నారు. ఎంకిని నిత్యం స్మరిస్తున్నా 1948 వరకు వీనిలో సగంపాటలైనా వ్రాయలేకపోయినాను. 1948 శ్రీ మంచాళ జగన్నాధరావు (All India Radio Patna) గారి స్నేహం లభించినది. వారు నాటి నుండి సంవత్సరమునకొక తూరియైన యిటువిచ్చేసి మాయింట విడిసి, వారి వీణాగాత్రములు మేళవించి. మనోహర గానమొనర్చి మాటుమణిగిన నాలోని పాటను మేలుకొలుప సాగిరి. వారి స్నేహభాగ్య మబ్బిన పిమ్మటనే యీ పాటలలో సగం పైగా వ్రాయగలిగితిని. వారికెంతో కృతజ్ఞుడను.

వారే ఎంతో శ్రమకోర్చి యీ కొత్త పాటలలో 40కి సరియైన (Notations) గురుతులతో స్వరాలు వ్రాసిరి; కాని అనివార్యము లగు కారణములవల్ల వానినిగాని వెనుకటి పా. కీ॥ శే॥ విద్వాన్ పారుపల్లి రామకృష్ణయ్యగారు వ్రాసిన స్వరాలుగా యీ తడపా ముద్రింప లేకున్నాను.

మిత్రు లీ పాటలు 'ఔ' ననియో 'కా' దనియో వీనిని ఆంధ్రలోకం యొక్క నదరులోపుంచినాను. కీ॥శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు గుణములేనిదే వారు దూషింపరేయని వానిని(ఎంకిపాటలను)చదివితి" నన్నారు కావున'కా'దన్న వారును నా పాటలు నేటివరకైనా నిలుచుటకే తోడ్పైనారు. వారికే ముందుగా నేనొనర్చు ప్రణామములు.

నా పాటలలో నొక చిన్నపాటకు శ్రీ భమిడిపాటి రామసోమయాజులుగారు (Now Advocate, Chidavaram Vizag Dt ) ఏనాడు 'భారతి'లో బొమ్మలువేసినారో నాటినుండి వీని పైవాదోపవాదములు పెరిగి జరిగిన ప్రచార మపారం.

కీ॥ శే॥ కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిలు వారు (Nuzvid Conference May 25) సర్ కట్టమంచి రామసింగారెడ్డిగారు (Reddy Conference. December '25) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలు వారు (Andhra Panditha Mandali Madras, April. 25) శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిలవారు (Introduc..

tion- YenkiSongs, 1st Edition) రావుసాహెబ్ శ్రీ గిడుగు రామ మూర్తి పంతులు గారు (1928 మద్రాసు) నా పాటల యెడ చూపిన ఆదరణ ఆ ప్రచారానికి దోహదమిడినది.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఏప్రెయల్ 1925 లో వీనిని ప్రప్రథమమున పండిత సభ కెక్కించియు, Prof P. Appala Narasimham M. A. L. T గారు 1926 లోనూ, శ్రీ బూర్గుల రామకృష్ణా రావుగారు (Now Chief Minister, Hyderabad) 1928 లోనూ వీనిని 'భారతిలో'లో సమర్థించుటయు శ్రీ ఎం. చలపతిరావు, ఎం. ఎ. గారును (Now Editor National Herald, Lucknow) మిత్రులు కోలవెన్ను రామకోటేశ్వరరావుగారును (Editor Triveni) త్రివేణిలో వీనిని సానుభూతితో విమర్శించియు, మహాపండితులు కవులగు శ్రీ వేదాల తిరువెంగళాచార్యులుగారు తమ 'ఆంధ్ర ధ్వన్యాలోకం' లో ఈ పాటలలో నొక పాటను ఉదాహరణగా గొనియు, ఆచార్య శ్రీ గురుగంటి సీతారామభట్టారకులు తమ 'నవ్య సాహిత్య వీథు' లలో 'యెంకి'కి కూడ తావొసంగియు, మా వెల్లంకొండ రాఘవరావుగారు ఒక్కొక్క పాటనే నిండు ప్రేమతో విమర్శించుచు పెక్కు వ్యాసములు వ్రాసియు, నా గురుతుల్యులు శ్రీ ప్రొఫెసర్ ఎస్సా అప్పారావుగారు (31-5 52) యెంకి పాటలకును గేయ ప్రపంచములో ఒక స్థాన మిడియు, 'బుచ్చిబాబు' మిత్రుడు దుక్కిటినాథుడు, శ్రీ రజనీగార్లు వీని చుట్టును నాటికలల్లియు, కీ॥ శే॥ అడివి బాపిరాజువంటి చిత్రకారులు వీనిని చిత్రించియు, సంగీతకళానిధి ప్రొ॥ ద్వారం వెంకట స్వామి నాయుడుగారి వంటి మహావిద్వాంసులు వీని నాదించియు, శ్రీ యం చలపతిరావుగారివంటి ఆంగ్ల పండితులు వీని నాంగ్లమున ననువదించియు, శ్రీ నటరాజ రామకృష్ణగారివంటి నాట్యాభినయవేత్తలు వీని నభినయించియు, కవి సామ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ సుప్రసిద్ధ నవలలో వీని దయతో పేర్కొనియు, సోదరుడు కృష్ణశాస్త్రి వీనిని గురించి పలుతావుల నభిమాన

ముతో పలికియు, వీనిని పెక్కు సభలలో పాడియు రసికులు శ్రీ గుడిపాటి వెంకట చలంగారు, వీనిని నిండు మనసుతో 'MUSE' చేసియు శ్రీ శ్రీ శ్రీ గారు 'స్వతంత్ర' లో వీనిలోని వెలుగులు చూసియు, మా సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకర స్వామిజీ వీనికి దీర్ఘాయువగునట్లాశీర్వదించియు, 'యెంకి' పాటలనుండి నా దృష్టి మరలకుండ చేసిరి. ఈ క్రొత్త పాటలు వ్రాయుటకు వారందరి అంతఃకరణ నాకు సాయమిడి యుండును. ఈ నా ముసలిదశలో నా పాటల మననం ఒకయెత్తు, వారల ప్రేమవాక్కుల మననం ఒక యెత్తుగా కాలం గడుపుచున్నాను. అది నా కృతజ్ఞత!

ఆల్ ఇండియా రేడియో మద్రాసు, విజయవాడ హైద్రాబాదు నిలయముల వారు నాపాటలు నాకే చిత్రగతుల వినిపిస్తున్నారు.

ఈ కొత్తపాటలు భాషలోనూ నిర్మాణంలోనూ పూర్వపు పాటల పంథానుండి వొయిదొలగినా వన్నారు. అందుకు సోదరుడు కృష్ణశాస్త్రి 8-5-53 న మద్రాసు కల్చరల్ క్లబ్‌లోనూ, కృష్ణాపత్రికా సంపాదకులు గడచిన రావుసాహెబు గిడుగు రామమూర్తిగారి వర్ధంతి సంచికలోనూ సమాధాన మిడిరి. మార్పు గుణమున కాయెనా దోషమున కాయెనా అను విషయము సహృదయలోకమే నిర్ణయించాలి. ఏయెడను మార్పు సహజం.

ఈ కొత్తపాటల అంకితం నా 'రవల వెలుగులు' పాటలో తల తడుముకొని తబ్బిబ్బులైన అద్భుతమూర్తికి, ఆ మూర్తికి నాకవిత్వ జీవితాదర్శములయెడ నీరసభావముతప్ప మరోభావమునకు తావులేదని యెరింగియు భక్తియ వేరు పూజాద్రవ్యములేమి? వీనినే అర్పించుచున్నాను.

ఏలూరు  
3-8-53

నండూరి వెంకట సుబ్బారావు  
గ్రంధకర్త

# ముద్దుల నా యెంకి

గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ
కూకుండ నీదురా కూసింత సేపు

... ... ... ... ...

నా కాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది
యెల్లి మాటాడిస్తె యిసిరికొడతాదీ!
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

... ... ... ...

కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది
దగ్గరస కూకుంటే అగ్గి సూస్తాదీ!
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

... ... ...

యీడుండ మంటాది యిలుదూరిపోతాది
యిసిగించు యిసిగించి వుసురోసుకుందీ!
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

... ... ...

మందో మాకో యెట్టి మరిగించినాదీ
వల్లకుందామంటే పాణమాగదురా!
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

... ... ... ...

## వొన లచ్చిమి

జాము రేతిరి యేళ జకుపు గిడుపూ మాని
సెట్టు పుట్టా దాటి సేనులో నేనుంటె
మెల్లంగ వస్తాది నామెంకి!
సల్లంగ వస్తాది నా మెంకి!

పచ్చని సేలోకి పండు యెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటుగొస్తాఉంటె
వొయ్యార మొలికించు నామెంకీ!
వొనలచ్చిమనిపించు నా మెంకీ!

యెంకి వస్తాదాని యెదురూగ నేబోయి
గట్టుమీదా దాని కంటి కాపడగానె
కాలు కదపాలేదు నామెంకీ!
కరిగి నీరౌతాది నా మెంకీ!

మాటలన్నీ సెప్పి మంచెకిందా కెల్లి
గోనిపట్టా యేసి గొంగడీ పై నేసి
కూలాస గుంటాది నామెంకీ!
కులుకు సూపెడతాది నామెంకీ!

యేతా మెత్తేకాడ యెదురూగ కూకుండి—
మల్లీ యెప్పటల్లె తెల్లారబోతుంటె—
సెందురుణ్ణీ తిట్టు నా మెంకీ!
సూరియుణ్ణీ తిట్టు నా మెంకీ!

## యెంకి ముచ్చట్లు

యేమ్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు
యేటని సెప్పేది నా యెంకి ముచ్చట్లు?

నొాడ్డి తోటకెల్లి తొంగి సూడంగానె
తోటకాడే వుందు సొరగొస్త నంటాది!

యేమ్నాని సెప్పేది...

యెంకి రాలేదని యేటో సూత్తావుంటె
యెనకాలగా వచ్చి 'యెవరువో' రంటాది!

యేమ్నాని సెప్పేది...

'సిట్టి సేబా' సాని నిట్టూర మేత్తుంటె
మాట యినబడనట్టు మరియేటొ సెపుతాది!

యేమ్నాని సెప్పేది...

'కోడి కూసేసరికి కొంపకెల్లాలి నీ
కోసరమె సెపుతాను కోపమొ' ద్దంటాది!

యేమ్నాని సెప్పేది...

'యెంత సేపున్నాను యిడిసి పెట్టాలేవు
తగువోళ్ళలో మనకు తలవొంపు' లంటాది!

యేమ్నాని సెప్పేది...

యెనకెనక సూత్తానె యెల్లుతా వుంటాది.

యేమ్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు!
యేటని సెప్పేది నా యెంకి ముచ్చట్లు!

# యెంకితో తిరపతి

యెంకీ, నాతోటీ రాయే!

మన

ఎంకటేశ్వరుణ్ణి యెల్లి సూసొద్దాము!

ఆవుల్ని దూడల్ని
అత్తోరికాడుంచి,
మూటాముల్లీ గట్టి,
ముసలోళ్ళతో సెప్పి,

యెంకీ, నాతోటీ రాయే...

ఆ సామి మీ దేటో
పూసులాడూకొంట,
కొండ మెట్లన్నీ నీ
కొంగట్టు కెక్కాలి,

యెంకీ నాతోటీ రాయే...

'రేతిరి పగ టేల
రెప్పెయ్య కెంకీని
సల్లంగ సూడ' మని
సామితో జెప్పాలి.

యెంకీ నాతోటీ రాయే...

# సత్తెకాలపు నా యెంకి

"నీతోటే వుంటాను నాయుడు బావా!
నీ మాటే యింటాను నాయుడు బావా!"
"సరుకు లేమికావాలె సంతనపిల్లా!"

"నువ్వ

మరమమిడిసి మనసియ్యి నాయుడుబావా!"
"సక్కదనమున కేమిత్తు సంతనపిల్లా!"

"నువ్వ

సల్లగుండు పద్దాక నాయుడుబావా!"
"యేడనే నీ కాపురమో యెల్లురు పిల్లా!"

"నీ

నీడలోన మేడ కడతా నాయుడు బావా!
నీతోటే వుంటాను నాయుడు బావా!
నీ మాటె యింటాను నాయుడు బావా!"

# దూరాన నా యెంకి

యాడుంటివే యెంకి యాడుంటివే?
పూతోరి పందిట్లో సీతాయి యెల్తుంటె

నీ తళుకు గేపకాన
నా తల తిరిగిందోలె!

యాడుంటివే యెంకి యాడుంటివే?
మామిడితోట కెల్లి
మంచీ పండొకటి గోసి

యేటోగాని, నోట్లేస్తె
యిసమై పోయిందోలె!

యాడుంటివే యెంకి యాడుంటివే?
పొత్తేళ జొన్న సేలో
సిత్తరమై పోతాది

గుమ్మైన వాసనొస్తె
గుండెగిరిపోయెనోలె!

యాడుంటివే యెంకి యాడుంటివే?

# యేటిదరి నా యెంకి

'యీ రేతి రొక్కతెవు యే మొచ్చినావే?'

'ఆడు నే నిక్కడే ఆడినామమ్మా!'

'యేటి నురగల కేసి యేటి సూసేవే!'

'మా వోడి మనసట్టె మరుగుతాదమ్మా!'

'సెంద్రవొంకలో యేమి సిత్రమున్నాదే!'

"వొంక పోగానె మావోడొస్తడమ్మా!

ఆడు నేనిక్కడే ఆడినామమ్మా!

మావోడి మనసట్టె మరుగుతాదమ్మా!

ఆ వొంక పోగానె ఆడొస్తడమ్మా!"

# రావొద్దె!

రావొద్దె నా పక్క రావద్దె యెంకి!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

నీ మీద పానాలు నిలుపుకొంటా వొచ్చి
అద్ద రేతిర్లోన అడివంత తిరిగానె!!

రావొద్దె నా పక్క రావద్దె యెంకీ!
ఆ పొద్దె మన పొత్తు లయిపోయె నెంకీ!

గట్టెక్కి సూసాను! పుట్టెక్కి సూశానె! !
కల్ల కపటములేని పిల్లవను కున్నానె!!!

రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మన పొత్తు లయిపోయె నెంకీ!

యేడ నువ్వుండావొ యేళ్ళన్ని యీదానె!!!
యేటి సేస్తుండావొ యీశ్వరు న్నడిగానె!!!

రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

# మాయదారి తమ్ముడు

(కృష్ణుడు)

నా సిన్ని తమ్ముణ్ణి నాకియ్య రయ్యో!
యేడుకొండలువోడ! యె కటేశ్వరుడా!

ఇంతోళ్ళ మప్పావు యీడ నిలుచుంటేని
నన్ను తరిమేసి మావోణ్ణి దాశావంట

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్య రయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

'యీసరికి మరిదీని నే సూడలే' దాని
యెంకీ కూడా నిన్ను యేడుకోవొచ్చింది!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్య రయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

'పిల్లోణ్ణి వోపాలి బేగి తెమ్మన' మాని
మాయమ్మ రేతీరి మరి మారి సెప్పింది!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్య రయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

మా వోళ్ళు సూంశాక మల్లి నీ కిస్తాను!
నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్య రయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

# నా యెంకి

నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు
మొన్న తిరిగొస్త నన్నాడే!

నీలు తేబోతుంటె, నీతోడె—నోలమ్మ!
నా యెంటె యెవరోను నడిసినట్టుంటాదె!
నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు . .

అద్దములో సూత్తుంటె అదియేటొ సిగ్గమ్మ!
నా యెనక యెవురోను నవ్వినట్టుంటాదె!
నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు, . .

నల్లని యెన్నెట్లొ సాపేసి కూకుంటె—
ఒట్టమ్మ— ఒల్లంత ఉలికులికిపడతాదె!
నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు. . .

నీతైనవోడె నా రాతెట్ట వుంటాదొ!
కళ్ళల్లొ సత్తెముగ కట్టినట్టుంటాడె!!!
నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు
మొన్న తిరిగొస్తనన్నాడే!!!

# నమిలి మింగిన నా యెంకి

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

మెళ్లో పూసల పేరు
తల్లో పూవుల సేరు
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు!

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

సెక్కిట సిన్నిమచ్చ
సెపితే సాలదు లచ్చ!
వొక్క నవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

పదమూ పాడిందంటె
పాపాలు పోవాల!
కతలూ సెప్పిందంటె
కలకాల ముండాల!

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

తోటంతా సీకట్లు
దొడ్డీ సీకటిమయిమె!

కూటికెళ్ళితే గుండె
గుబగుబ మంటా బయిమె!

ఎంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
ఎంకి నా వొంకింక రాదోయి రాదోయి!

రాసోరింటికైన
రంగుతెచ్చేపిల్ల!
నా సొమ్ము—నాగుండె
నమిలి మింగిన పిల్ల

ఎంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
ఎంకి నా వొంకింక రాదోయి రాదోయి!

# కటిగ్గుండెల నా యెంకి

నీ వెల్లిపోయినావంటే
        పచ్చినై
నేనేటో కొట్లాడుతుంటే;
        యిరుగమ్మలక్కలతో నీవా
                నా యెంకి
        యెకసక్కె మాడుతున్నావా!

నిన్ను రచ్చించ మంటానే
        పద్దాక
యెన్నొ దణ్ణాలు పెట్టేనే!
        వొన్న సీరలుగట్టి నీవా
                నా యెంకి
        వోసుగా తిరుగుతున్నావా!

పొద్దత్తమానాలు కాదే
        నీవూసె
వొద్దన్ననూ మరపురాదే!
[illegible]మ్మలక్కలతోటి నీవా
                నా యెంకి
        సెమ్మసెకాడుతున్నావా!

కేతిర్లో మనతోటకాడా
వొళ్కణ్ణి
నా తిప్ప లీశ్వరుడు లేడా!
సీకు సింతాలేక నీవా
నా యెంకి
పోకల్లె పొందుకున్నావా!



## తోటపూసు

తోటవూసంటే సికాకూ
మెంకి

తోటి యెల్లే దాని సోకూ!
బంతి సేమంతట్ల
పర్రువంత మాసింది
మల్లెంటు మెల్లంగ

మారు మొగ మేసింది!
తోటవూసంటే సికాకూ
మెంకి......

తూర్పేపు మళ్ళేటి
దుబ్బు దుర్రాసేటి;
అంటు మామిళ్ళేటి
ఆ వారస పళ్ళేటి!

తోట వూసంటే సికాకూ
మెంకి......

గొడ్డూ గోదా బెంగ
గొని సిక్కిపోనాయి;
గడ్డి మేటిని సూత్తె
కడుపె సెరువౌతాది!
తోటవూసంటే సికాకూ
యెంకి... ... ...

నూతికాడే సోకు
యేతాముదే సోకు;
పోయి "పాడో" యంటె
'వో' యంట పలికేని!
తోటవూసంటే సికాకూ
యెంకి... ... ...

బలము సీదాపోయి
బడుగునై పోనాను'
కృష్ణా రామా యంట
కూకోవలి సొచ్చింది!

తోటవూసంటే సికాకూ
యెంకి ... ... ...

# యెంకితో బద్రాద్రి

దాంపత్య యోగాలు.

ఆడ ని సుక్కాని యీడ నే గెడయేసి
పడ వెక్కి బద్రాద్రి పోదామా!
బద్రాద్రి రాముణ్ణి సూదామా!

గోదారి గంగలో కొంగు కొంగూ గట్టి
కరువుతీరా బుటక లేదామా!
సరిగెంగ తానాలు సేదామా!

కొత్త మడతలు కట్టుకోని పేజలో కెల్లి
'రామన్న రాముడో'- యందామా!
రామకతలే పోయి యింటామా!

సంబరము కెదురుంగ జంటగా సిలుసుండి
సామివోరికి దణ్ణ మెడదామా!
సాష్టాంగ సాపసుట్టుగ నేల బడదామా!

ఈడ నీ సుక్కాని ఆడ నే గెడయేసి
పడవెక్కి మనపల్లె కెడదామా!
బద్రాద్రి రాముణ్ణి సూదామా!

# యెట్టి సరదాలు

మెంకి వస్తాదాని
యెదురు తెన్నులు కాసి
దిగులెట్టి, తలదించి
తిరిగి సూసేతలికి—

మెంకిరావాలి నా యెదర నిలవాలి!
కొంటెగ కులుకుతా నన్నేటో పలకరించాలి!

పిల్ల పొరుగూరెల్లి
మల్లి రాలేదని
వోల్లంత వుడుకెత్తి
వొక్కణ్ణి పొడుకుంటె—

ఘల్లుమంటా మెంకి కాలుపెట్టాలి!
'మెల్లివొచ్చా' నంట మెంకి నవ్వాలి!

మెంకి కోపాలొచ్చి
యే దేశమో పోయి
కల్లో నా కొపడితె
కళ్ళు తెరిసే తలికి

తళుకుమని మెంకి నాదరికి రావాలి'
'నిదర కాబోసంటు నింద నాడాలి!

# యెంకి సూపు

రా॥ పల్లి

పదిమందిలో 'యెంకి
పాట' నే పాడంగ
గోడసాటున యెంకి గుటక లేసే యేళ

సూడాలి నా యెంకి సూపు లాయేళ!
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ!

'నా పాటె పా' టంట
'నా మాటె మా'టంట
నలుగు రమ్మలు సేరి నను మెచ్చుతావుంటె

సూడాలి నాయెంకి సూపు లాయేళ!
సూడాలి నా యెంకి సోద్దె మాయేళ!

పొరుగమ్మతో నేను
వొరస లాడే యేళ
పొలమెల్లి నే పొద్దుపోయి వచ్చేయేళ

సూడాలి నా యెంకి సూపు లాయేళ!
సూడాలి నా యెంకి సోద్దె మాయేళ!

# యెట్టి నా యెంకి

'యెనక జన్మములోన
యెవరమో నంటి!
సిగ్గొచ్చి నవ్వింది
సిలక—నా యెంకి!

'ముందు మనకే జల్మ
ముందోలె' యంటి!
తెల్ల తెల్లబోయింది
పిల్ల—నా యెంకి!

'యెన్నాళ్ళో మనకోలె
యీ సుకము' లంటి!
కంట నీ రెట్టింది
జంట—నా యెంకి

# యెంకి పయనం

కల

పడుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కది పేసినాదీ!

ఎడ తెగని జలమంట!
నడమ నో పడవంట!
పడవెక్కి నాయెంకి పయన మయ్యిందంట!

పడుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కది పేసినాదీ!

యెంకేటొ బ్రమపుట్టి
యెనక తిరిగిందంట'
సందెగాలికి పడవ సాగిపోయిందంట!

పడుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కదిపేసినాదీ!

నీటిగాలికి యెంకి
పై టెగురుతాదంట!
పడపోయి నట్టేటొ పడ వెల్లినాదంట!

పడుకుంటె నాకేటొ బ్రమ పిట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కదిపేసినాదీ!

పిల్లసిగలో పూలు
కళ్ళిప్పి నాయంట!
మిడిసిపాటున దోనె మీరిపోయిందంట!

పడుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కదిపేసినాదీ!

మెడసాటు పూసోటి
మినుకుమంటాడంట!
పంతాన గంతేసి పడవ పోయిందంట!

పడుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

అంసల్లె బొమ్మల్లె
అందాల బరిణల్లె వతె
సుక్కల్లె నా యెంకి స్రురిగిపోయిందంట!

పడుకుంటె నా కేటో బ్రమ పుట్టినాది!
కడుపులో సెయ్యేసి కదిపేసినాది!

# కను బొమ్మలు

నన్ను తెలుసుకు యెంకి కన్ను మూయాలి!
కనుబొమ్మ సూడాలి!
కరిగిపోవాలి!

నన్ను కలలో సూసి నవ్వుకోవాలి!
కనుబొమ్మ సూడాలి!
కరువు దీరాలి!

నిదరలో సిగపూలు సదురుకోవాలి!
కనుబొమ్మ సూడాలి!
కమ్మగుండాలి!

పిలుపేదో యినగానె తెలివిరావాలి.
కనుబొమ్మ సూడాలి!
కతలు తెలియాలి!

# సాలు! సాలు!

మనిసే సాలు మనిసి సూటే సాలు
మనిషి వాసనె సాలు మనిసే సాలు

ఏతాము కెదురుంగ యెంకుంటె సాలు
వొంటరిగ సిటి కేసి కుంట కలిపేను
మనిసే సాలు ... ...

యెంకి యందెల గలగ లినబడితే సాలు
కళ్ళు మూసుకు నీరు మళ్ళి కత్తేను
మనిసే సాలు ... ...

యెంకి గా లోకసారి యిసిరినా సాలు
తోటంత రాజుల్లె తొవ్విపాసేను
మనిసే సాలు ... ...

అందాల నా యెంకి వృందంటె సాలు
సబ్బరముగా రేత్రి నిదరపొయ్యేను
మనిసే సాలు ... ...

# ఆకాలపు నా యెంకి

దూరాన నారాజు కేరాయిడౌనో
ఈ రోజు నా రాత లే రాలపాలో
సీమ సిటుకనగానె
సెదిరిపోతది మనసు—
కాకమ్మ సేతైన కబురంప డారాజు
దూరాన నా రాజు కే రాయిడౌనో .........

కళ్ళ కేటో మబ్బు
గమ్మేసి ట్టుంటాది—
నిదరల్లో నావొల్లు నీరసిత్తన్నది
దూరాన నా రాజు కే రాయిడౌనో ... ...

ఆవు 'లంబా' యంట
అడిలిపోతుండాయి—
గుండెల్లో వుంగుండి గుబులు గుబులౌతాది
దూరాన నా రాజు కే రాయిడౌనో... ...

తులిసెమ్మ వొరిగింది
తొలిపూస పైరిగింది—
మనసులో నా బొమ్మ మసకమస కేసింది
దూరాన నా రాజు కే రాయిడౌనో ... ...

# ఉత్తమా యిల్లాలు

ఉత్తమా యిల్లాలి నోయీ
నన్ను సురుపెడితే దోస మోయీ
నిదరంలో నిను సూసి సెదిరె నేమో మనసు
పొరుగు వోరంత నా సరస కురికారంట
ఉత్తమా యిల్లాలి నోయీ!... ...

'ఏలనే నవ్వా'ంట, 'ఏడుపేలే' యంట
పదిమంది - ఆయింత పగలబడినారంట
ఉత్తమా యిల్లాలి నోయీ ... ...

గాలెంట వోయమ్మ దూళెంట వోయమ్మ
యిరుగు పొరుగోరంత యిరగబడినారంట
ఉత్తమా యిల్లాలి నోయీ ... ...

యీ బూది వోకతెట్టు! యీ పింకోకతె తట్టు
నీలు సిలికే దోకతె! నిలిసి సూసే దోకతె!
ఉత్తమా యిల్లాలి నోయీ!... ...

సాటునుండే యెంకి సబకు రాజేశావ?
పదిమంది నోళ్ళల్లో పడమంట రాశావ?
ఉత్తమా యిల్లాలి నోయీ ... ...

# పిల్లోడు

యెంకితో తీర్థాని కెల్లాలి
సంకలో పిల్లోణ్ణు సంబ్రాలు పడుతుంటె
యెంకితో తీర్థాని కెల్లాలి

నెత్తిమూటల నెత్తుకోవాలి
కొత్త మడతలుదీసి కట్టాలి
అడవి దారులయెంట నడవాలి

బిగువు మారుసుకొంట పక్కున్న నవ్వాలి
యెంకితో తీర్థాని కెల్లాలి
సంకలో పిల్లోణ్ణు సంబ్రాలు పడుతుంటె
యెంకితో తీర్థాని కెల్లాలి

తాతనాటి వ్రూసు తలవాలి
గాంపొంగుం కీసు లాడాలి
'సప్ప సీదే' యంట దెప్పాలి

దేవ మున్నాడని దడిపించుకోవాలి
యెంకితో తీర్థాని కెల్లాలి
సంకలో పిల్లోణ్ణు సంబ్రాలు పడుతుంటె
యెంకితో తీర్థాని కెల్లాలి

కతకాడ కూసింత సేపుండాలి!
కతగాడు మా వూసె జెప్పాలి!
నను చూసి పిల్లోడు నవ్వాలి!

మూలోన మూమేటో మతులిరుచుకోవాలి
యెంకితో తీర్తాని కెళ్ళాలి
సంతలో పిల్లోడు సంబ్రాలు పడుతుంటె!
యెంకితో తీర్తాని కెళ్ళాలి!

కోనేటిలో తానా మాడాలి!
గుడిసుట్టు ముమ్మార్లు తిరగాలి!
కోపాలు తాపాలు మానాలి!

యిద్దరము పిల్లోణ్ణి యీశుడికి సూపాలి!
యెంకితో తీర్తాని కెళ్ళాలి!
సంతలో పిల్లోడు సంబ్రాలు పడుతుంటె!
యెంకితో తీర్తాని కెళ్ళాలి!

# ముందు పుటక

నాపక్క తిరిగి మాటాడవా! యెంకీ
యీ సిక్కు నీ విప్పగలవా!

యీ జంట విడిపోయి
యేవాడనో తేలి
యెంకిపా టివగానె
యెదర నిలిసేదెవరో!
నానూపు
సెదరగొట్టేదెవరో!
నాతోవ
సదును సేసేదెవరో!
నాపక్క తిరిగి మాటాడవా! యెంకీ
యీ సిక్కు నీ విప్పగలవా!

మనసేతితో నాటి
మన సొంతమని పెంచి
మనకోట యీతోట
మరపు రాకుంటాద!
నా గుండె
మరిగిపోకుంటాద!
నాపక్క తిరిగి మాటాడవా! యెంకీ
యీ సిక్కు నీవిప్పగలవా!

వొాయికుంటమే నీతో
వొారుగుతాదని నమ్మి
కలిసున్న నాకాసి
కన్నెత్తి సూసేవ

నీ వొాన్నె
సిన్నేలు సూపేవ?
యింతింత

అన్నేయ ముంటాద?
నా పక్క తిరిగి మాటాడవా? యెంకీ
యీా సిక్కు నీవిప్పగలవా?



# పంటసేలకే పయనం

యీ యేపు నోయావు ఆయేపు నోయావు
జోడావులకు నడుము నా యెంకి
యీడు
జోడుగా నిలుసుంటె నా యెంకి
ఆట
లాడతా కలిసుంటె నా యెంకి
నన్నె
సూడుసున్నట్టుండు నా యెంకి!
ఈయేపు నోయేరు యేపు నోయేరు
యేళ్ళ రెంటికి నడుము నా యెంకి
తలను
పాలకడవెత్తుకొని నా యెంకి
సేత
పూలు పుణుకుకొంట నా యెంకి
పూల
బూరవోయిస్తానె నా యెంకి
నన్నె
పోలుండుమంటాది నా యెంకి!

ఈ కాడ నోకొండ ఆ కాడ నోకొండ

కొండ కోనల నడుమ నా యెంకి

పాల

కుండ దింపూకోసి నా యెంకి

గుడికి

దండ మెడతావుంటె నా యెంకి

సూడ

రెండెళ్ళ కసిపించు నా యెంకి!

ఈసాయ నోసేను ఆసాయ నోసేను

సేల రెంటికి నడుమ నా యెంకి

పాలు

పూలు నా కందిచ్చి నా యెంకి

'సామ్మి

లేల మన' కంటావి నా యెంకి

గుండె

జాలి పుట్టిస్తాది నా యెంకి

# సాటేలా ?

సాటేలా? నీకు మాటేలా? సిన్నతనమేలా? సిగ్గేలా?
ఆ సీమ యీసీమ
అందరందాలు    సౌందర్యరాశి-
తిన్నంగ నినుసూసె
దిద్దుకుంటారు!
సాటేలా? నీకు మాటేలా...
ముందు మన పాపణ్ణి    సంతానప్రాప్తి.
కింద దిగనీరు వరస
యెంకి క్రో వంటారు
యెత్తుకుంటారు
సాటేలా? నీకు మాటేలా ... ...
యెంకొక్క దేవతై సౌభాగ్యం.
యెలిసె నంటారు—
యింటింట పెడతారు
యెంకి నీ పేరు?
సాటేలా? నీకు మాటేలా?... ...

# దీపం

ఆరి పేయవె దీపమూ!
యెలుగులో సిమీాద— నిలపలేనే మనసు
ఆరిపేయవె దీపమూ!

జిమ్మ్మమంటా తోట
సీకటై పోవాలి
సీకట్లో సూడాలి
నీ కళ్ళ తళతళలు!
ఆరిపేయవె దీపమూ

తళుకుతో నీ రూపు
తలుసుకొని తలుసుకొని
సీకట్లో నాకళ్లు
సిల్లులడ సూడాలి!
ఆరిపేయవె దీపమూ... ...

సూపులే ఆపేసి
రూపు వూసే మరిసి
వొకరెరుగ కింకొకరు
వొరిగి నిదరోదాము
ఆరిపేయవె దీపమూ!... ...

# కనుపాప

అద్దమే లంటాది అందాలు తెలప
ముద్దుమాటల కెంకిదే ముందు నడక
అద్దమే లంటాది అందాలు తెలప...
కంటెదర నాకాడ కనిపాపలో నీడ
సూసుకుంటా నోసట సుక్కెట్టుకుంటాది

అద్దమే లంటాది అందాలు తెలప
ముద్దుమాటల కెంకిదే ముందు నడక

కనిపాపలో నీడగని నవ్వుకుంటాది
మొకము సిటిలిస్తాది రకరకము లవుతాది

అద్దమే లంటాది అందాలు తెలప
ముద్దుమాటల కెంకిదే ముందు నడక

కంటెదరి నా కాడ కంట నీరెడతాది
కనిపాపలో నీడ మన సదరగొడతాది!

అద్దమే లాంటాది అందాలు తెలుప
ముద్దుమాటల కెంకిదే ముందు నడక



# పడవ

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు
పాడలేనే యెంకి పదము లీ రొాదలో
పడవ సల్లగ నడిపి
పదము సదు వంటావు
కస్సుమంటా యేరు
గాలి నెగదోసింది ?
    ఆపలేనే యెంకి ఈ పడవ యిసురు — —
బోరుగాలే పాట
దారి కడతా వుంది
బేటి కురికే పాట
నోట గొాడతా వుంది
    ఆపలేనే యెంకి యీ పడవ యిసురు — —
తలములుపుకొాన్ని పాట
తరలింది కామోాసు
దేముడల్లే లోనె
తిరుగుతున్నా డేటొా
    ఆపలేనే యెంకి యీ పడవ యిసురు ——
యెన్నెలంటే పాట
కెంత మనసవుతాదొా
పాట సాగేతలికి
పయనమే మవుతాదొా
    ఆపలేనే యెంకి యీ పడవ యిసురు ——

# ముందుగతి

ఎక్కవే కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే
కొండ నెక్కవే

పక్క సూపులు మాని
పయికెల్లి పోదాము
యెక్కవే కొండ నెక్కవే
నా సక్క నెంకీ యె[illegible]వే

ముందు నువ్వుంటెనే
కింద నిలబడగలను
నీ నీడనే తొక్కు
కొని సులువుగ రాగల
నెక్కవే కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే

నాలు గడుగులేసి
నవ్వుతో పిలు యెంకి
పిలుపు నవ్వే నాకు
ములుగఱ్ఱ కాగలదు
యెక్కవే కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే

తెల్లన్ని నీ పైట
సల్లంగ యిసురోతె
ఆగాల నా కాలి
కట్టె బగ బగ మండు

నెక్కవే! కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే

పదిమెట్లు పయికెల్లి
పల్లకుండా సూడు—
పగబట్టు పామల్లె
పయికి సర్రున వత్తు

నెక్కవే! కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే

యెల్లెల్లి పయికెల్లి
యిద్దరము కలిసి
మూట లివతలపెట్టె
మునిగిపోదము పైనె

యెక్కవే కొండ నెక్కవే
నా సక్క నెంకీ యెక్కవే

# గోవు మా లచ్చిమి

గోవు మా లచ్చిమికి కోటి దణ్ణాలు
మనిషికైనా లేని మంచి పోకిళ్ళు
యెంకితో కూకుండి
యింత సెపుతుంటే
తన తోటి మనిసల్లె
తల తిప్పుతాదీ
గోవు మా లచ్చిమికి కోటి దణ్ణాలు......

యెంకి సరసాలాడ
జంకుతా వుంటే
సూసి సూడక కన్ను
మూసి తెరిసేది
గోవు మా లచ్చిమికి కోటి దణ్ణాలు......

కోరి కూకుని నేనె
పోరు పెడుతుంటే
తల్లిడిపు పిల్లల్లె
తెల్లపోతాదీ
గోవు మా లచ్చిమికి కోటి దణ్ణాలు......

# ముత్యాల పేరు

అద్దములో నా రాజ
అంత నీ రూపు
ఇంత ముత్తెములోన
యిరికె నేలాగు
ఇన్ని సొంకాలున్న యెంకివే నీవు
ఇంత నా గుండెలో యిమిడిపోలేదా
వోసూపె వోరూపె
వోనవ్వొ రాజా
యిన్నింటి వో పాలె
యెటు సెదిరినాదో
మాటలో మనసులో మంచిలో - యెంకి
సొగసు నీ వోసార్కె అగపడవ నాకూ
అటుతిరగ విటు మసల
వా మరమ మేటో
ఆణిముత్తెములోన
ఆడిపోతావే
కనుకల్లె సినుకల్లె కూకుండె యెంకీ
కబడకె మనసులో గంతు లేయవలే

# ఆ నా టి నా వో డు

ఆనాటి నా వోడు సెందురూడా
అలిగి రాలేదోయి సెందురూడా
'యెంకి మన మిద్దరమె
యెవ్వరో' ద్దన్నాడు;
'యీ సేలు యీతోట
లింక నీ' వన్నాడు—
మాటాడుతుండంగ సెందురూడా
మంచిదా పోయేవు సెందురూడా
'కలకాల మీ దినమె
నిలుసు మన' కన్నాడు;
'గాలికై నా తాను
కవుగి లీ' నన్నాడు—
ననుసూసి నవ్వేవు సెందురూడా
నాయమా నా ముద్దు సెందురూడా
నాకాసి సూశాడు
నీకాసి సూశాడు
'మద్దె సెంద్రుడె మనకు
పెద్దమని' నన్నాడు—
కన్నీరు నీకేల సెందురూడా
కనికారమే శాన సెందురూడా

# సుక్క

సుక్కొక్కడున్నాదో సూడవే చెల్లీ
బారెడైనా కొండ పైకి సాగిందేమొ
సుక్కొక్కడున్నాదో సూడవే చెల్లీ...
తాను నిలిపిన గడువు దాటి పోనేలేదు—
కాలు సేతులు పక్కకంటుకోని పోనాయి
సుక్కొక్కడున్నాదో సూడవే చెల్లీ...
సుక్కతోనే కొండ లెక్కొత్తు నన్నాడు—
మబ్బా మనిసో కొండ మలుపు పరకాయించి...
సుక్కొక్కడున్నాదో సూడవే చెల్లీ...
వొకటొకటిగా బొట్లు వొదిలి దిగిరావాలి—
తోటమొలపల గలగ లేటొ యిన నీవమ్మ
సుక్కొక్కడున్నాదో సూడవే చెల్లీ ...
నా సొగసు నన్నైన సూసుకోనీడమ్మ—
ఆవు మెళ్ళో మువ్వలల్లె మోగిన వేళ
సుక్కొక్కడున్నాదో సూడవే·చెల్లీ...

## వుత్తమాటలు

'వుత్తమాటలు నీవి పొ'మ్మందిరా
యెంకి
'కొత్తపాటలు పాడుకో' మ్మందిరా
వూరెల్త నని పలికి
మారేస మేసుకోని
'సకినాల పా టొచ్చు
సకిన మడు' గన్నాను—
'వుత్తమాటలు నీవి పొ' మ్మందిరా
యెంకి
"కొత్త పాటలు పాడుకో" మ్మందిరా

"యీా రోజు నీ రాజు
వూరెల్లినా" డంటి
"నే రాపులో రూపు
మారిపోయిం" దంటి...
"వుత్తమాటలు నీవి పొ" మ్మందిరా
యెంకి
"కొత్తపాటలు పాడుకో" మ్మందిరా

"మొదల మీా రీయేటి
మొగనె కలిశా" రంటి
"మెరుపల్లె పాటె త్తి
మురిపించినా" డంటి

"పు త్తమాటలు నీవి పో" మ్మందిరా
యెంకి
"కొ త్తపాటలు పాడుకో" మ్మందిరా

"కొద్దిలో వొారహాల
కొడుకు నె త్తే" వంటి
"యీా నిజము తేలేక
యీానాములి" మ్మంటి

"పు త్తమాటలు నీవి పో" మ్మందిరా
యెంకి
"కొ త్తపాటలు పాడుకో" మ్మందిరా



# అంకితము

నా 'రవల వెలుగుల' పాటలో
తల దడుముకొని తబ్బిబ్బులైన
అద్భుత మూర్తికి

# వెలుగు నీడలు

కోటి గొంతులు కలిసి
పాట పాడేతీరు
వెలుగు నీడల నడుమ
నిలిచి ఆలింతు

ఏటి మిలమిల లోన
తోట నవనవలోన
వెలుగు నీడల పొత్తు
తెలిసి పాలింతు

'ఎంకెవ్వ' రని లోక
మెప్పుడైన కదిపితే
వెలుగు నీడలవైపు
వేలు సూపింతు!



## సాము

కత్తిమీదే సాము కొత్తిమీదే కూడు
సత్తు వెరిగిన వారె విస్తుపోయేరు
ఎన్నడూ నానోటి
సున్నితము పోనీదు——

కటువైన పలుకంటె
కలి వెలవుతాది
కత్తిమీదే సాము కొత్తిమీదే కూడు
సత్తు వెరిగిన వారె విస్తుపోయేరు

సూపుతో మాటాడి
వూపిరితొ తెనిగించు
కనుబొమ్మతో నవ్వి
మనసు కరిగించు

కత్తిమీదే సాము కొత్తిమీదే కూడు
సత్తు వెరిగినవారె విస్తుపోయేరు

మన యెంకె యని కాని
సనువులకు పోరాదు——
తొలిగినా కలిగినా
దూరం దూరానే

కత్తిమీదే సాము కొత్తిమీదే కూడు
సత్తు వెరిగిన వారె విస్తుపోయేరు!

# తెరచాటు

లేపకే నా యెంకి లేపకే నిదరా
యీ పాటి సుకము నే నింతవర కెరుగనే
లేపకే నాయెంకి...

కలలోన నాయెంకి
కతలు సెప్తున్నాది—
వులికులికి పడుకొంట
'ఊఁ' కొట్టుతున్నాను లేపకే...

కతలోని మనిసల్లె
కాసింతలో మారి
కనికట్టు పనులతో
కత సదువుతున్నాది లేపకే ...

రెక్కలతొ పైకెగిరి
సుక్కల్లె దిగుతాది—
కొత్తనవ్వుల కులుకు
కొత్త మెరుపుల తళుకు లేపకే...

తెలివి రానీయకే
కలకరిగిపోతాది...
ఒక్క నేనే నీకు
పెక్కునీవులు నాకు లేపకే...

# రాగతనం

కొమ్మలో కోకిలా 'కో' యంటదే...
రాగతనమో యేమొ బాగువోగెరుగదే
కొమ్మలో కోకిలా...

యెంకి దూరా నుండె
ఏటిదరి నేనుంటి...
'సావాస మింకెవరో
సందడెవరో' నంటి కొమ్మలో...

పూలెరుగ నా కోత
నీలెరుగ నామోత
మనుగడల కెవరితో
మనసు కలిపేదంటి కొమ్మలో...

ఏటికడుపున దాగి
తోట నిదురోయింది
'అలనా' నా సొదకు
'పాలనా' యనుకొంటి కొమ్మలో...

తరిమి తరిమేశాను
తిరిగి 'కో కో' యంది...
ఆడిందె ఆటగా
పాడిందె పాటగా కొమ్మలో...

# పూలబాసలు

పూలబాసలు తెలుసు యెంకి కీ
తోట
పూల మనసు తెలుసు యెంకి కీ
పూల మొక్కల నీటి
జాలుగని నిలుసు
పూలన్ని నీ పాటె
ఆలించె నంటాది పూలబాసలు...

పూలంటు కాలంటి
పున్నెముం దంటాది
పగలమారీ పడుచు
నగదొడిగె నంటాది పూల...

తెరలెత్తి పూపడవ
పరుగెత్తుతా వుంటె
దారెంట పూలొంగి
దణ్ణమిడె నంటాది పూలు...

పూలతో వియ్యాలు
పూలల్లో కయ్యాలు
మానల్లె నన్నుంచి
తానె పూవౌనేమొ పూల...

# కలత నిదర

ఈ రేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర

ఆకాశ మేఘాలా
అణిగిపోయిన రేయి
యేటి సెందురుడల్లె
సాటు సూపుల కులికి —

ఈ రేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర

ఆకాశ మాతీరు
అడిలిపోయిన రేయి
మాటలెరుగని పాప—
ఏటి గిలగిలసూసి—

ఈ రేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర

ఆకాశ మావొరస
ఆవులించిన రేయి
మిసమిసలతో యేటి
పసలలో సనుసుట్టి ...
ఈరేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటి పాలేనటర

యెలుతురంతా మేసి
యేరు నెమ రేసింది
కల వరపు నా బతుకు
కలత నిదరయ్యింది—
ఈరేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర

ఒక్క తెను నా కేల
ఓపజాలని సుకము
ఈరేయి నన్నొల్ల నేరవా! రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర



# తబ్బిబ్బు

రవల వెలుగుల గంగ రమ్మందిరా—
మెంకి

శివమెత్తి తానాలు చేసిందిరా
సిరులతో ముత్యాల
సరుల చెల్లాటతో
సిరిసిరీ మువ్వాలా
చిందులా గంతులా
రవల వెలుగుల గంగ రమ్మందిరా—
మెంకి

శివమెత్తి తానాలు చేసిందిరా
సికలోన సికకలిపి
మొకము మొకమూ కలిపి
వెలుగు దేవతకు చ
క్కిలిగింత లెట్టింది
రవల వెలుగుల గంగ రమ్మందిరా—
మెంకి
శివమెత్తి తానాలు చేసిందిరా

నీలలో మునిగిం ది
తేలింది వెలుగుతో—
మబ్బు సెందురుడల్లె
మనిసిలో మనసల్లె
రవల వెలుగుల గంగ రమ్మందిరా—
యెంకి...

శివమెత్తి తానాలు చేసిందిరా
కాశిదేవుని యెదుట
గరవాన నిలిసింది—
తల తడుముకోని తానె
తబ్బిబ్బులైనాది
రవల వెలుగుల గంగ రమ్మందిరా—
యెంకి...

శివమెత్తి తానాలు చేసిందిరా



# కా శీ రా ణి

నామాట తెలుపవే నా రాజుతోటీ
మా మనసులను కలుపుమా కాశిరాణీ

నా కళ్ళలో చూచు
ఏ కాడొ తలపుంచు
తల పచట వల పిచట
తగునటమ్మా తనకు		నామాట...

వనమంత వొంటిగా
దినమంత తిరుగునే
తన నీడ పాసైన
సనువు లేదే నాకు		నామాట...
అలి సలిసి యిలు సేరి
అడగనీ డె బాధ
మనసునైనా పాద
మంటనీడే నన్ను		నామాట...

నవనీతమే రాజు
అవలీల పని నీకు
వలపు మాటల కెంత
శిలలైన కరుగునే		నామాట...

# మా ట కో ట లు

ఆట పాటలలోనె మరచినావా రాజ
మాటకోటల లోనె మసల మన్నావా

వరస దీపాలుంచి
సరసనే నిన్నుంచి
ఆ కాంతి నీ కళ్ళ
గని మొక్కుకొను నన్నె ఆట...

నెలవంక పలకలో
నీ రూపె గీతురా
తలవంచి సెలయేట
ఆ రూపె సూతురా ఆట...

కలలోన నీవునా
కంటి కవుపడకున్న
మెలకువయ్యే దాక
కలవరించెనునన్ను (గిలగిలాడేనన్ను) ఆట...

కందుఎరుగని మనసు
గాయమై పాయెరా
నీకై చేటని కంట
నీరు రానీనురా ఆట...

# సంద్రం

యింతేసటే సంద్ర మెంతో యనుకొంటి
మనకూ సూరీడుకూ మద్దెనుందేనా
నా నీతి నా జాతి
నా వారె పోనాడ
మరిగి నా మనసు సా
గరమాయె నన్నారు ఇంతే...

నా రాజె నా కాసి
వేరు సూపులు సూడ
కడలివలె మా గుండె
కలతబడె నన్నారు ఇంతే...

సత్తె మెరిగిన పాప
పాత్తిళ్ళలో దాగి
కన్నీరు మున్నీరు
కరగిస్తి నన్నారు ఇంతే...

అంచు దరి లేదంటె
అమృత ముంటాదంటె
దేముడం తుంటాదో
ఏమొ యనుకొన్నాను ఇంతే...

# కుచ్చితాలు

ఎంకి పులకల కలల
కెడమాయ గోరి
అడుగడుగు నిలిచేను
ఆలసించేను

*　　　　*　　　　*

పెదవి సివురాకులను
కదిలింప గోరి
అడిగిందె అడిగేను
ఆలకించేను

*　　　　*　　　　*

ఎంకి కళ్ళను జారు
జంకు కనగోరి
పయనాలు నటియించి
బయలు దేరేను



# కో కో కో

కొండ తిరిగీ
కోన తిరిగీ
చీర చెరుగున
కూరిచితిరా
గరికపూలా కంఠమాలా

* * *

ఆవు నడిగీ
అడివి నడిగీ
పూల గిన్నెల
పొందు పరచితి
గుమ్మ పాలు కొమ్మ తేనె

* * *

చాయ వన్నెల
లోయ బయలా
పచిక మొత్తల
పానుపు పైన
'కో కో' యందు 'కో' యనరా



# యెంకి రాణి

పూల జూరను వేడి
గాలితో నింపి
తేనెగొంతున వింటి
తీరైన పాట

*                *                *

గాలిలో యెగ రేసి
నీల చుక్కలను
రమ్మంటి చేతిలో
రాలె రతనాలు

*                *                *

పూలతో యెంకినే
పూజింప బోతి
యెంకి నిలువున మెరిసె
యెవ్వారో రాణి



# నేను - తాను

తనువంత నా రాజు తపసెయని - నేను
మనసులో యెంకితో మంతనము - తాను

బతుకంత నా రాజు పాటెయని - నేను
పాటలో యెంకిలో పల్లదము - తాను

నిదరంత నా రాజు నీడె యని - నేను
కలలోని యెంకితో కిలకిలలు - తాను

జగమంత నా రాజు సొగసెయని - నేను
అద్దమున యెంకితో విద్దెములు - తాను



# పోత

ఏ తపసు నే జేయువలెనో
యెంకితో
ఎటుల నే నేక మవగలనో
శిశువులో మా జంట
చిన్నె లున్నాయంట
బాలలే మనకన్న
మేలులే యంటాది ఏ తపసు...

తనరూపె నా మేన
తళుకు మన్నాదంట
నిలప జాలని సిరులు
నీకె తగునంటాది ఏ తపసు...

నా కంట కనసీదు
నా కంఠ మననీదు
తను లేని కలవేల
కని నే మనగరాదు ఏ తపసు...

తలపోసి మా కళలు
కలబోయ వలెనంట
గౌరీశులకె బాగ
గరువ భంగముకాగ ఏ తపసు...

## నాగరీకాలు

నా పేరె నా రాజు జపమన్న అపవాదు—
యీ పుటకదే కాదు యెప్పటికిపోదు నా పేరె—

వరసవా రెవరైన
తరచి తరచడిగినా
తప్పించు నా పేరు—
తలపడే తలపడే నా పేరె...

ఏకాంతముననైన
'యెంకి' యని పిలువడే
చప్పన్న పేర్లెట్టు
చెప్పకుంటే రట్టు నా పేరె..

పక్షి పేరొకమారు
పండు పేరొకమారు
రాలేన ఒకతీరు
పూలేన పలుమారు నా పేరె...

ఏనాటి వరములో
యీ నాగరీకాలు
పాటలో తేన పరువౌ
బతుకులో బరువటే నా పేరె...

# అడ్డగింపు

యిప్పుడెటులుంటినో చెప్పుకోవోయీ ...
"చిన్ని వన్నెల రామ—" చెప్పనీవమే

...　　　...　　　...

యీ గొంతు పలికేది యెవరి పదమోయీ
"వొంక వొంపులులేని—" జంకు నీకేల

...　　　...　　　....

వనమంతలో చక్కదనమెవరిదోయీ
"పొంకాల పోకిళ్ళ—" పోకె నువుగాదే



## పూల యుద్ధము

నా యాస రగిలింప
సాయముగ యెంకి
పూల దన చెక్కిళ్ళు
మేలుకొలిపేను....

— — —

బాధ నా యెదసింప
సాధనగ యెంకి
పెదవి జిగ జిగ పూల
పదును పరిచేను....

— — —

విసిగించి నన్నొంప
వీలుగా యెంకి
పూలలో రాచకా
ర్యాలు సలిపేను....

— — —

కోపాల నా కోట
కూలూవగ్గ యెంకి
పూల రంగములోన
కాలు దువ్వేను....

# పౌ రు ష ము

ఏ వూరో నె బోవ ఎంకో దొరయింట—
నా వేసమున యెంకి నటియించు నంట

చెట్టు లత నాలాగు
చిత్తగించుట సాగు—
ఒక తీగె తలవాగ
ఒకతె సిగ దిగలాగ ఏ వూరో

ఆవులను నావలెను
అదలించుకోవలెను—
గలగలలు విలుబొమలు
తెలిసి కలబడ ఆలు ఏ వూరో

పసిబాలు ననుదోలి
కసరు పిసరులనేలు—
పాలగని కోపాల
బాల పకపక లాడ ఏ వూరో.

యీ వింత యీ లోన
ఆ వంక నేగన్న
నేరమంతా నాదె ఏ వూరో.

# వనదేవి

మనకేల యెడబాటు
లనుచు నా యెంకి
వనదేవి కనబోయి
వరమందె రేయి

... ... ...

విడిచింది వన్నింట
నడిచింది అడివంత
అడుగడుగు కనులెత్తి
ఆకసపు తల మొత్తి... మనకేల...

... ... ...

తొలినాటి మా కతలు
తల పోతలో యేమొ
పళ్ళెరములో పళ్ళు
తుళ్ళింతపడెనంట మనకేల...

అచటచట మా నటన
ఆనాలు కాబోలు
కంఠహారపు వేయి
కళ్ళు సుడివడెనంట మన కేల...

. ... ... ...

ఆ లోయ లా యేరు
లా లోకమే వేరు
సిగనగను మిన్నంత
దిగి దిగులు వడెనంట మన కేల...

.... .... ...

వనదేవితో గుడిసి
మని వాయెనో లేదో—
యింతలో యింటిలో
యెటు చూసినా యెంకి మన కేల....

ం తా లు

యీా సందె కీయంద మెవ్వారిడిరోయీా'
'ఆకాశమున విల్లు అంకాన యెంకి'

... ... ....

'రేయి ముచ్చటల చెలరేగి రెవరోయీా'
'నెలవంక దరిచుక్క చిలిపి నా పక్క'

... ... ...

'పగలు రే లెడబా ఔరుగ రెవ్వారోయీా'
'శంకరుడు సతియుచట యింకెవ్వారిచట'



# సరాగాలు

పూవు నేనైతే
నే
నీ వలపునౌదు
పూనిన్నే జగమంత
ధ్యానింపజేతు

* * *

నేను కోయిలనైతే
నీ రాగమౌదు
దిశలహో నిన్నె
కీర్తింపగా జేతు

* * *

రాయి నేనైతే
నీ
ప్రాణమ్మునౌదు
ముజ్జగము రా నిన్నే
మొక్కగా జేతు

* * *

నీవు నేనైతే
నిను నీలో కందు
నేను నేనుగ నుండె
నీలోనె యుందు

# కలకలిమి

కల పూల సరులచట
కలవేమొ యంచు
కల తెలివిగని తోట
గాలించు మెంకీ॥

*        *

కలజాడ లీ మేన
నిలిచెనో యంచు
అద్దాన రేమేమొ
దిద్దుకొను మెంకి

*        *        *

కలలోని కతలన్ని
కనబడునొ యంచు
కలమిణుగురుల గన్న
కులుకు నా మెంకి

*        *        *

కనిపెట్టె నే సరిగ
కల చెప్పుకొనగ
కల కలిమి సత్తెమని
కులుకు నా మెంకి



# రాకపోలు

ఏ లోకమోపోక ఎటకో నా రాక
యితగు లెవ్వారి కెరుక యెంకికేగాక

చేలపాటున నేను
చెట్ల చాటున తాను
పాట జగమును రేపు
పాటు యుగమును బాపు   ఏ లోకమో...

మోట నడుపుట నేను
తోట తడుపుట తాను
మనిసినే యని వగతు
మాకునై పో వలతు   ఏ లోకమో...

చేనులోనే నిదర
తాను వెలుగుచు యెదర
స్వప్న లోకముదించు
స్వర్గమును ప్వారించు॥   ఏ లోకమో...



# నటీనటులు

'యెంకి' నా పేరితని
కేమి లేదట వీని
'నెవ రెరుగ రంటా'
'నామకానామకుల నటన నేడంతా'
'యుగ యుగము ఒకరొకరి
తగిలినామట' చేయి
మిగిలినామంటా
'పగలు రేయులు సుంత పట్టుపడకుండ'
'వాలి కౌగిలి సుకము—
నేలి నామట చూపు
కలిపినామంటా'
'ఆకసము భూమియటు లంటుకోకుండ'
'ఒక్కౖటై సరసాల'
చొక్కినామట యింటి
'కెక్కినా మంటా'
'బింబ ప్రతిబింబమటు వీడి విడకుండ'
'ఇంత యెంకితో నటన
యెవ్వరోనట యీాత
డెవ్వరోనట' యెంకి
'రవ్వపాలంటా'
'ప్రకృతిసుందరి జంట పరున కెటులంట'

# ఎంకి కళ

ఇంక నను పిలిచెర యింత తలిచేర
యెంకికేగాక నా కిట వూర - పేరా
నెమిలె ననుగని యరుగు
నేలచూపుల దిరుగు
యెంకిదరి శ్రీసంచు
యెన్నోలయల నటించు ఇంక...

నాగోవె నన్ను నా
నా గతుల నలయించు
యెంకి కడ యిల్లాలు
యెంకి చెయ్యానాలు ఇంక...

నే నాటు పూలంటె
నే నంటితే అంటు—
యెంకితో సరాగాలు
ఏక సనుమానాలు ఇంక...

ఏది నే పాడినా
ఎంకి పాటె యనేరు
ఏ పదములో నైన
ఎంకి కళనె కనేరు ఇంక...

# ఎంకి కల

నిన్న నా కలలోన విన్నావు కాదా
పున్నమన్నట్టు తెలుపు ఒట్టు నా మీద
బంగారు రెక్కల
పక్షిమనుషులు నన్ను
పైనుంచి కని దిగుచు
ప్రశ్న చేసిరి నన్ను నిన్న...
వెలుగు చిలికెడు నోట
వింతగొలిపెడు మాట
పాడియాడిన మురువు
పదపదము చిత్తరువు నిన్న...
వళ్ళ కొండల గుళ్ళ
నెగిరి పైగని యనిరి—
'ఎంకి దెదో ఎదో లోక
మెవుడు ఎమొ ఎమొగాక' నిన్న...
కల నాదెకద యన్న
గర్వాన విననపుడు
కల దూర మెగుర రె
క్కల నీవు నీవిపుడు నిన్న...

# పూల సేవ

పోనులే నేసింక పూలచాయలకు
పూల సేవమె ప్రోవలిడెమాకు
పోనులే—

గోపూజ పూలునే
కోయగా తడవాయె—
పువ్వుపువ్వు నడుమ నేనె
కవుల కెర నవ్వుదునట   పోను—

తను దలచి పూలె నా
తలనుంచ తప్పాయె—
తనకంటె పూలె నా
తలసేలు శ్రీలంట   పోను—

యీమేని పూతావె
యెడము మూకిడనాయె—
యవి తెర పసలక్ష్మ
దాచుకొన్నానంట   పోను—

మనసు తెలియని వేళ
మంచియే చెడుగాయె
యీ పూసరుల సిరులు
యెంకి కవసరమ టే   పోను—

# నీటి చిత్రాలు

కొంటె పటముల మీల గొనిరాసె నేడు
కోనేట కిరణాల కుంచె రేరేడు
పరువమగు జతమీలు
పరుగులిడు రతనాలు
ఎదురు సన్నాహాలు
బెదురు బెదురు సుఖాలు — కొంటె___
సరికిసరి బేరాలు
అరకంటసర సాలు
అలలగని బింబాలు
పలటిల్లు పాశాలు — కొంటె___
నిలువబో కసలువం
కెలల దగిలిన ఘుక్కా
వలయాల పయనాలు
కళలు వెలసిన మీలు — కొంటె___
ఎంకి కిడి బహుమతులు
యీ నీటి చిత్రాలు
అలిసి మునిగెడు మీలు
ఆకాశమున దేలు — కొంటె___
బొమ్మవై ఖరి కులికి
కొమ్మమాటిడి కంటి — కొంటె___

## ఆ ఱ కు వ

ఎంతెంత దూరాన
ఎందరిలో నే నున్న—
సూటిగా నా వెనుక చూసె నా యెంకి
చురికి నే తనవైపు తిరుగవలసినదే

*　　　*　　　*

ఏటవల నేబోయి
యిల్లు చేరని రేయి—
ఏట దీపము పళ్ళ నిడినదా యెంకి
వెలుగులో నే నచట మొలవవలసినదే

*　　　*　　　*

కథనడుమ మా జోడు
నిదుర దోగిననాడు—
కథకొన తలుకుగోరి కల గనెన యెంకి
కలను నే జొరి కథలు తెలుపవలసినదే!



# ము సి ము సు లు

యెంకి జలకపు పలుకు లెచట నిడుకొందు
ఎంత దాచిన చెణుకు లెగురు నిందందు

మడుగున జలకమాడ
మా నీడ లలలపై
గోరంత మా నటన
కొండంత జేసెనట — ఎంకి జలకపు...

నీలపై మా రహా
న్యాల గొని తీరు తీ
రాల పరుగిడి మమ్ము
గాలె యెగతాళియట — ఎంకి జలకపు...

మెరుపు మేఘులఁ మించు
సరసులను మముగాంచి
అకసమె వులికి మడు
గడుగున పడిసదంట — ఎంకి జలకపు...

రతనాల వేదికను
రవల చాందిని కింద
ముత్తెపు తలంబ్రాలు
ముసిముసుల పెళ్ళింట — ఎంకి జలకపు...

# దీపసుందరి

దీప సుందరితోటి సాపత్యమా నాకు
దీప సుకుమారి దరి దాపు చనగలనా
రంగుకోక ధరించి
రాజు రాక తపించు
నీడలను తెలివి విడ
నాడి కన నుంకించు     దీపసుందరి...
రెప్ప వాల్పక మింట
లెక్కించు చుక్కలను
అలికిడికి వులికిపడు
నలువసల విరగబడు     దీపసుందరి...

నిలువంత చెవి జేసి
పిలుపు విన నోరగిలు
కటిబిగించును శిరను
కాని లెమ్మని విసురు     దీపసుందరి...

కెవ్వుమని కిందబడు
నవ్వు నాలుక సాచు—
'రాజా' యనుచు నెరిగి
'రా రా' యనుచు ఘనుకు     దీపసుందరి...

వేదన సుఖాన మను
వెలుగుచు శుభాన చను     దీపసుందరి...

## జా ళి

రాలు రేలును పూలె జాలి నొలికెడురా
వేలుపే నీ కంటె చాల సులభుడురా
నా యలికిడికి నేనె
రేయి కొండలనడల
శిఖర శిఖరమ్ముల నీ
ముఖమె చూపునురా — రాలు రేలును...
ఒక్కన నెమళ్ళ గని
చుక్కల మొయిళ్ళగొని
నీ కళ్ళె నీ నిలువె
నింగిరా యనురా — రాలు రేలును...
పూ లతలె నా వెతల
పొలిచి మెలికెల్లారి
వాళ్ళు ఝల్లన నిన్నె
కళ్ళ గట్టునురా — రాలు రేలును...
ఏమియుడుఁగకె గుడిని
సామికడనే నిలిచి
హారతీయగ వెలిగె
మూర్తి నీదేరా — రాలు రేలును...
వుసురుల పసలు చెల్లి
ఒంటినై యుంటగని — రాలు రేలును...

# మరపు

ఏటికోయి మన చెలిమి - నీట చిత్తరువుల కలిమి
కలయొ తెలుపు మన మనసుల కలయికల నిజానిజాల

అలక నలసి నేను కునుకు
తెలివిని నను నీవు చెనక—
కనకె నీ సరాగసరణి
కల రెక్కల పరతు దివిని ఏటికోయి...

కనులు కనుక బొమలు కులుకు
నని నను తనివార కనెదు—
యెరుగ వింత కలలో నా
మరుగు మరులు తిరుగు తెరలు ఏటికోయి...

నీ యెద వ్రాయల లీ యెడ
పోయెద కల పలుపోకల—
కలలో కలగందు నొకట
తెలివి సీమర లచట నచట ఏటికోయి...

ఈ నందనమున నిను నను
ఆనంద సుఖమున మరతు
కలలో నను చూతువేమొ
కత్తి కెరను జేతువేమొ ఏటికోయి...

# జయభేరి

కళలీను వనమె వెల - వెలలేల నోయీ
వనలక్ష్మి కన గాచు - కొను దినము లేమో

*  *  *

వుం డుండి పూలటుల - వులికె నేమోయీ
కడుపులో పాప చ - క్కిలిగింతలేమో

*  *  *

చిలుక పావురము లటు - చిందు లేలోయీ
ఆప్తమిత్రుని రాక శాస్త్రమో యేమో

*  *  *

వురుములు మెరుపు లాయె - దరికి రావోయీ
జయభేరితో వెలుగె దయసేయునేమో



## శివశివా

తనివితీరలేదే ఆ తరుణ మాగిపోదే
కార్తీక దీపాల గంగ కలలె కందునే పదేపదే

తలకిందు తపనున కాశి
నిలిచె గంగ నను నీ వగ
శంకరుడే యెరుగడింత
సావాసమ్మును నీ వగ తనివి

నీలను మన వేలు వేలు
కీలింపగ వెదకు సుకము
నను తాకిన అలయె నన్ను
పెనగొన నీ పులక తళుకు తనివి...

నీ కరముల వెలుగు గంగ
నా శిరమున అభిషేకము
'శివశివా' యనంగ ప్రజలు
సిగ్గున మునిగెడు నీ భ్రమ తనివి...

ఉదయమె నా దోయిలి నీ
పుడక ధారలుంచు రక్తి
బిందు బిందు కోటి సూర్య
బింబము లాలికించు శక్తి తనివి...

# బరిణె

కలవారి గని అలంకారాలు గొనుట
పులి బోలదలిచి వాతల నింపుకొనుటె
ఘనులు తమ సకియలను
మణులతో కై సేయ
ఆకు లలములె యెంకి
కాయె నా యిడు సరులు    కలవారి...
ఆకుల కులపు సరులె
వేకనులలో కదిలె
మెప్పున మెరిసె కనులు
నిప్పులు గురిసె మణులు    కలవారి...
పనితన మనగ సఖులు
పస లేదనగ ఘనులు
పలువాయి సమరాల
నలిగె నాకుల సరులె    కలవారి...
వెలవోసి యీ సరులు
నిలువ నీడ నొసంగి
స్వాంతమటు దాచె నొక
వలపు పలుకుల బరిణె    కలవారి...
నను గూడ నటె దాచు
మని పొగిలె నా యెంకి    కలవారి...

## యెంకి తనము

ఆ చిత్రమునకు మెరుగు నీ చక్కదనమే
యీ చిత్రమునకు వెలుగు నీ యెంకితనమే

కొమ్మనొక చేయూని
గోవునొక చేయూని
వేళ్ళు కవిపితివా నె
మళ్ళజత దిగియాడ ఆ చిత్ర...

చిలుక పావురము నీ
చేవ్రాల చెంపగొని—
అంత ననుగని వింత
వంత మీ మువు రెగుర ఆ చిత్ర...

కోడె పసి లేడి నడి
కోన నిను పసిగట్టి
'నేను నే' నని యురికి
నినుతాకి కనుమూయ ఆ చిత్ర...

ఏటి కనుచా టొసగ
తోట నీడల తెరలు—
నాటి వెన్నెలనావ
నా నీ - మరువ నీవ ఆ చిత్ర...

# చిలుకపలుకు

ఎకసకె మెవరికి తెలుసు
ఎంకిచిలుక మనసు గడుసు                ఎకసకె...

'పేరంటము పిలిచి తోట
చూరవిడుతె' యని నేనన—
చిలుకను పురికొలిపి నన్ను
'బలిరాజా' యనిపించిన                ఎకసకె...

గాయపడిన లేగకు నే
సాయమిడకె సాగిపోవ—
చిలుకను వుసిగొలిపి నన్ను
'శిబిరాజా' యనిపించిన                ఎకసకె...

కలలో తన సెలవులేకె
కానలబడి పోతినేమొ—
మొలకవగని చిలుక బిలిచి
'నలరాజా' యనిపించిన                ఎకసకె...

పూలను గద్దియ నమరిచి
పూల కిరిటము కూరిచి
'రాజా' యన తానె కోరు
'రాణీ' తన మనుకొంటిని                ఎకసకె...

ఎగతాళియు వెంతో సొగసు
యెంకి చిలుక మనసె మనసు                ఎకసకె...

# చెర

కరములు సిరులు పరుల కారింపనా
ఎంకి
కనులెత్తి నా రాజు గతులెరుగునా
'నా రాజు కగుశయ్య
శేరాజు చేరె' నని
శయ్య సదురును యెంకి
చంద్రుగని కనులార్చు కరములు సిరులు...
పానుపున మా జోటి
పవళింపు భావించు
వెచ్చ వెచ్చని పాన్పు
వే విధుల లాలించు కరములు సిరులు...
తనను వెన్నెల సోక
తప్పువలె కోపించు
'రాజు పస గను రాజు
రాడ' యని తలయూచు కరములు సిరులు...
నేరాక తనుతరల
నా రాక గని మరలు
కళ్ళలో చందురుని
కైదుగొనీ నిదురించు కరములు సిరులు ...
దూరాల దారపైని గారాల రాజుకీ
కరములు సిరులు పరుల గారింపనా
ఎంకి
కనులెత్తి నా రాజు గతులెరుగునా

# రే వెలుగు

ఎవరైన యెప్పుడైన యే వాడనైన
యింతిజాలి గనేగ యెంకి చిత్రాలు

మొయిలు జారె చంద్రుడని
భయపు మిష నా యెంకి
పూ సజ్జె నా పజ్జ
పోగుపడ - ఆరటము   ఎవరైన యెప్పుడైన...

మబ్బు వెలువడు చంద
మామ గని తన చీర
చెరగు మాటిడి నన్ను
జీరు సిగ్గరితనము   ఎవరైన యెప్పుడైన...

'కళ్ళ ములుకులు దించె
కంఠపాశము లేసె
కిరణాలు నువులేని
తరి, యనెను - ఆకులము ఎవరైన యెప్పుడైన...

'దృష్టి' తొలగగ తనను
తిలకముగ నే గొనిన
నెలవంక నా రాజు
తులయె యను - అతిశయము ఎవరైన యెప్పుడైన...

రే వెలుగు గీ వెలుగు
నా వెనుకె యను మతము ఎవరైన యెప్పుడైన...

# ఉయ్యాల

ఎంకి వూగెను కొమ్మ వుయ్యాలా చంద్ర
వంక వూగెను బొమ్మ వుయ్యాలా
ఏటిపై కొమ్మ నూ
యెల యెంకి అమరించె
నీట బొమ్మ వుయాల
నెలవంక వెలయించె — యెంకి—

ఎంకి వన్నెల చీర
నెగిరె వెన్నెల పూలు
ఎండుటాకుల గొలుసు
వెండి తీగలు చేరె — యెంకి—

సిగపూలు ముంగురులు
చిరు నువల మొలనూలు
ఒకచే సదురుకొనుచు
ఒయ్యారమే వూగె — ఎంకి—
తీగల నడుమ నూగె
దీపమై తిలకమై
పీఠమై— ఎంకికి—కి
రీటమై నెలవంక — ఎంకి—
మున్నీటి యాజోడె
ఆనాటి కీనాడు: — ఎంకి—

# తపస్సు

"సాగరుని సల్లాపమా అల
చందురుని యుల్లాసమా నిక
తాతలాల విలాసమా
ఆ పగిది బంధించు నీ కనుపాప నెయ్యది తాపసీ!"

"కలదు నా పాలకుని కంటను
కడలి కల దీ చందమామయు
అలల తలపై నాట్యమాడుదు
రచట దంపతు లెవ్వరో

ఆట కలరును సాగరుండును
అలల ననుకూలముగ నడుపును
దంపతులు నింపుద రతని రత
నంపు కాంతుల కాన్కలన్

బాల భక్తులవలె నిలింపుల
లీల శంపాలతికయన గో
పాలు దరహాసాంచలమువలె
నటన సలిపిరి చిటికలో

ఆటలాడెడు నా సురూపమె
కోటి గుణితంబయ్యె త్రుటిలో—
పాలకుడు తనుమఱచి పరవశు
లీల కన్నులు మూయగన్

సాగరుని సల్లాపమేలా
సైకతంపు విలాసమేలా
చందురుని యుల్లాసమేలా
లోకమిక నేలా!”

